# శ్రీ రామచంద్ర ప్రభు స్తుతి

## శతకము

తమ్మెర సీతారామప్రభావ సంగ్రహము



గ్రంథకర్త:

నరహరి గోపాలాచార్యులు

# కృతి

గీ॥ అర్పణ మొనర్చినాడ నత్యధికభక్తి
శ్రీ ధరాతనయా మనోజీవములకు
సేవకాఖిల భక్త సంజీవములకు
శ్రీ రఘూత్తము పాదరాజీవములకు.

# రామచంద్రప్రభుస్తుతి

## శతకము



తమ్మర సీతారామప్రభావసంగ్రహము



గ్రంథకర్త:

నరహరి గోపాలాచార్యులు



— బెజవాడ —

ఆంధ్రగ్రంథాలయ ముద్రాక్షరశాల యందు

అ. వేంకటరత్నం, M. Sc. గారిచే

ముద్రింపబడియె, 1944.

# పీఠిక



మహాత్ములారా!

ఈ శతకమునం గల పద్యము లప్పుడప్పుడు వ్రాసి యుంచిన వయ్యు, దేశకాలస్థితులగురించి నే నిప్పుడు ముద్రింపించుటకు శక్తిలేనివాఁడనగుట నే తత్కృతినాథుఁడగు సీతానాథుఁడే తన ప్రభావము వెల్లడింపఁదలంచి నాచే బిచ్చమెత్తించి పదుగురచే ద్రవ్యమిప్పించి ముద్రింపఁజేసి, గ్రంథమంగీకరించె; దీనం గల్గిన దోషంబుల మన్నింప బ్రార్థించుచు కృపతో ముద్రణకుఁగా ద్రవ్య మొసగిన వారికి నితోధిక భక్తివిశ్వాసము లొసంగి రక్షింప దయాశరధి యగు దాశరథికి సాష్టాంగప్రణామము లొనర్చుచున్నాఁడను.

దయతో నీ పుస్తకముం బరిష్కరించిన యస్మత్కవితా గురులగు శతావధాని సంపన్ముదుంబ సింగరాచార్యులవారి కెంతయు కృతజ్ఞతతో నమస్కరించెద.

ది 23—1—1944.
స్వభాను సం॥ పుష్య బ ౧౩
ఆదివారము.



ఇట్లు,
గ్రంథకర్త.

## ఈ గ్రంథముద్రణకు సహాయపడిన ధర్మాత్ముల పేర్లు.

తమ్మరగ్రామం

2-0-0 శ్రీ కోదాటి లక్ష్మీనరసింహారావు గారు

1-0-0 ,, కాసనాల కొండయ్యగారు

5-0-0 ,, బొల్లు సీతారామయ్యగారు

4-0-0 ,, కనగాల వీరయ్యగారు

1-0-0 ,, కనగాల లక్ష్మయ్యగారు

2-0-0 ,, పెదబొల్లు వీరరంగయ్యగారు

బోడవాడగ్రామం

2-0-0 శ్రీ కొత్తపల్లి సత్యనారాయణ ,,

1-0-0 ,, ఉమ్మినేని చుక్కమ్మగారు

పెనుగంచిప్రోలు గ్రామం

1-0-0 శ్రీ పరాంకుశం నరసింహాచార్యులు గారు

2-0-0 ,, పబ్బతి పిచ్చయ్యగారు

ముక్కపేటగ్రామము

1-0-0 శ్రీ కనగాల వెంకటనరసయ్యగారు

1-0-0 ,, కొట్రా రాధాకృష్ణశాస్త్రిగారు

1-0-0 ,, కనగాల చంద్రయ్యగారు

0-8-0 ,, కనగాల కోటయ్యగారు

1-0-0 ,, సిరికొండ వేంకటాచార్యులు గారు

అనంతగిరిగ్రామం

1-0-0 శ్రీ తూములూరి రామయ్యగారు

వజినేపల్లిగ్రామం

5-0-0 శ్రీ కాచిరాజు హనుమంతరావు గారు

2-0-0 ,, కాచిరాజు నారాయణరావు గారు

పైనేనిపల్లిగ్రామం

2-0-0 శ్రీ నాగుబండి కోటయ్యగారు

1-0-0 ,, వోరుగంటి నారాయణగారు

0-8-0 ,, కొండుర్తి బసవయ్యగారు

అగ్రహారంగ్రామం

1-0-0 శ్రీ పాలకొల్లి వెంకటనరసయ్య

బోదులబండగ్రామం

1-0-0 శ్రీ రాయపూడి వెంకటరామనరసయ్యగారు

చెరువుమాధవరంగ్రామం

1-0-0 శ్రీ కొలపాల చినవెంకటేశ్వరరావుగారు

5-0-0 ,, లకిల నరసింహంగారు

1-0-0 ,, కోముల రాఘవయ్యగారు

1-0-0 ,, యారి నారాయణగారు

1-0-0 ,, ఉత్తర తాళ్ళపాక నరసింహాచార్యులు గారు

1-0-0 ,, ఇంగువ లక్ష్మీనరసయ్యగారు

1-0-0 ,, కొలపాల పెదవెంకటేశ్వరరావుగారు

1-0-0 ,, యార్ల జోగయ్యగారు

1-0-0 ,, కొండపల్లి సుబ్బారావుగారు

2-0-0 ,, కొలపాల సత్యనారాయణ రావుగారు

3-0-0 ,, కొలపాల జగన్నాథరావు గారు

5-0-0 ,, కొండపల్లి సీతారామారావుగారు

1-0-0 ,, కొండపల్లి పెదసీతారామారావు గారు

1-0-0 ,, కొమరగిరి జగన్నాథరావుగారు

కూసుమంచిగ్రామం తాలూకు ఖమ్మంమెట్టు

10-0-0 శ్రీ కేశిరాజు లక్ష్మీనరసింహారావు గారు

జగ్గయ్యపేటగ్రామం

1-0-0 ,, తుమ్మలపల్లి నరసయ్యగారు

1-0-0 ,, గుండా రామలింగయ్యగారు

### నైజామ్ వైరా

1-0-0 శ్రీ కొత్తూరు మల్లయ్యగారు

### ఆకుపాముల గ్రామం

3-0-0 శ్రీ కోదాటి సీతారామారావుగారు
1-0-0 ,, చిల్లంచెర్ల లక్ష్మీనరసింహం గారు
0-8-0 ,, కేసగాని సీతారాములుగారు
0-8-0 ,, బాణాల పర్వతాలు గారు
1-0-0 ,, కొత్తూరు మాణిక్యయ్యగారు
1-0-0 ,, కటారు రాజయ్యగారు
1-0-0 ,, పెనుగొండ మల్లయ్యగారు
1-0-0 ,, మిట్టపల్లి నరసయ్యగారు

### ముకుందాపురం

5-0-0 శ్రీ అకుల నారాయణగారు
1-0-0 ,, పెనుగొండ వీరయ్యగారు
1-0-0 ,, పెనుగొండ వెంకయ్యగారు
1-0-0 ,, ఈగా వెంకటప్పయ్యగారు
1-0-0 ,, పోలిశెట్టి గోపయ్యగారు
1-0-0 .. అకుల సూరయ్యగారు
1-0-0 ,, అకుల రోశయ్యగారు
0-8-0 ,, నర్రా రుక్మయ్యగారు
2-0-0 ,, బోళ్ళ ముట్టయ్యగారు
1-0-0 ,, నర్రా పెదనరసయ్యగారు
1-0-0 ,, ముసుకుల పిచ్చయ్యగారు
0-8-0 ,, ఆరె వెంకయ్యగారు
1-0-0 ,, పందిరి వెంకటరామయ్యగారు
0-8-0 ., నర్రా కనకయ్యగారు
0-8-0 ,, పోలిశెట్టి గురవమ్మగారు

### మాధవగూడెంగ్రామం

1-0-0 శ్రీ బోడపాటి హనుమంతరావు,,

### ఆరెగూడెంగ్రామం

1-0-0 శ్రీ గోరట్ల కనకయ్య సుతారి ,,

### గండ్రాయిగూడెం

1-0-0 శ్రీ కనపర్తి చినజోగయ్యగారు
1-0-0 ,. చిత్రపు సత్యనారాయణగారు
2-0-0 ,, కనపర్తి వెంకటనారాయణ గారు
1-0-0 ,, కనపర్తి వీరయ్యగారు
0-8-0 ,, కనపర్తి లక్ష్మయ్యగారు
0-8-0 ,, గొంపిచర్ల అనంతాచార్యులు గారు
0-8-0 ,, కట్టా సుబ్బయ్యగారు
0-8-0 ,, అలపాటి లింగయ్యగారు

### మంగోలుగ్రామము

2-0-0 శ్రీ మన్నె ముత్తయ్యగారు
1-0-0 ,, మన్నె నారాయణగారు



# శ్రీరామచంద్రప్రభు శతకము

శా. శ్రీరంబాలుండను నీపదాంబుజములన్ సేవించుచున్ మ్రొక్కుచున్
మాళిందాల్చుచు మానసాంతరమునన్ మన్నించుచున్ వేడుచున్
గాలంబెల్ల గమించు దివ్యతరభాగ్యం బిమ్మ చాల్ చాలు నా
కీ లోకంబున నేని సత్యముగ తండ్రీ! రామచంద్రప్రభూ. ౧

శా. రాగద్వేషముఖాదిశత్రువులఁ బారందోలి సత్యంబు మా
యోగక్షేమములన్ వహించెదు మహోద్యోగంబు నీకున్న దం
చా గీతావచనంబునం దలిసి యన్యాలంబముల్ మాని నీ
దా గాథావళిఁ జింతచేసెదను దేవా! రామచంద్రప్రభూ. ౨

శా. మర్యాదారహితాప్రమేయ కరుణామాధుర్యముల్ సంతతా
శ్చర్యాపాదకముల్ సదార్తజన రక్షాదక్షముల్ భ్రాజి తౌ
దార్య శ్రీకరముల్ భవత్సుగుణముల్ ధ్యానింపలే డాసురా
చార్యుం డింక వచించునెవ్వఁ డఖిలేశా! రామచంద్రప్రభూ. ౩

శా. ఆద్యంతంబులు నిండి సర్వజగదాత్మానంద సంధాతవై
హృద్యాగంబున బాహ్యయాగమున నొక్కింతైన మా చేయు పా
ద్యాద్యర్చావిధు లెల్లఁ గైకొనె గ్రహింపుము వేదాంతసం
వేద్యా! మత్కవితాసపర్య నతిప్రీతిన్ రామచంద్రప్రభూ. ౪

మ. స్వపనర్యాప్రభృతిన్ నున్న నిన్నుఁ జటుభక్తిన్ గొల్వలే కన్యదే
శవుక్షేత్రంబులకేగి యొండొక విశేషం బెద్దియే నాత్మ నొ
కపుడైనం గనజాలనైతిని త్వదీయాశీస్సుచే నిప్డు దూ
రపుకొండల్ నునుపన్న భ్రాంతి తొలఁగెన్ రా! రామచంద్రప్రభూ.

మ. హృదయక్షేత్రమునందు కందళితమయ్యెన్ భక్తిబీజంబు నీ
సదయాపాంగవిలోకనాంచిత సుధాసారంబునన్ సిక్తమై
అది నిర్వాణఫలంబు మాకొసగుపర్యంతంబు రక్షింపుమం
చిదె బద్ధాంజలి నౌచు మ్రొక్కెదను తండ్రీ! రామచంద్రప్రభూ. ౬

శా. దిక్సంఘాతము దేవతావిభులు ధాత్రీధ్రంబులున్ నక్షత్రశో
భాకోపార్కము ఖాదిగ్రహంబులున్ వారాశిధుల్ భూతముల్
వాక్ప్రాదర్శము మున్నుగాఁ గలుగు సర్వంబీవుగా నెంచు వి
ష్వక్సేనాదుల కంజలింతు నఖిలేశా! రామచంద్రప్రభూ. ౭

మ. భవదీయోత్తమ పాదపీఠము కడన్ బ్రహ్మాదిముఖ్యుల్ వేవే
లు విశేషంబుగ మ్రొక్కుటన్ గలుగు నీలోకంబు నాపంగ సూ
త్రవతీనాథుఁడు చాలకుండునఁట నీ దాస్యానుసంయుక్తి పై
భవమే పండితు లెంచ శక్తుఁడగు దేవా! రామచంద్రప్రభూ. ౮

మ. ప్రతికల్పంబున వచ్చిపోవు సలబ్రహ్మాది దేవాళికిన్
గతికల్పించెదు దైవతంబవగుచున్ గారుణ్యమే పారగా
సతతంబాశ్రిత రక్షణక్షమ సత్కీర్త్యాబద్ధ సత్కంకణా
ప్రతివారీ నీ సరివారు లేరు రఘువీరా! రామచంద్రప్రభూ. ౯

మ. బలసంపన్నులకంటె గొప్పబలసంపన్నిధి యయ్యుఁ దపం
చలమై యొప్పునటుల నారఘువరత్వాసక్తులౌ నయ్యమా
దుల నాగన్ శరచాపపాణి వయి నాయెరమ్ము లోరమ్ముగా
నిలపై మేను ద్యజించు వేళఁ గృపఁ దండ్రీ! రామచంద్రప్రభూ. ౧౦

మ. సతుఁడౌ వాని లలాటమందు గల నానా నీచ మూర్ద్వర్ణ పం
క్తిని వ్రాపి సువర్ణ పంక్తులనుగా గీలించు నామస్థ్వమ
చ్యుత! యుష్మచ్చరణాంగుళి ప్రజమునం దొప్పారుటన్ నీ పదా
శ్రితు లన్యంబు దలంప రెట్టిదశలన్! శ్రీరామచంద్రప్రభూ. ౧౧

మ. ప్రభుసమ్మానముగాంచు దాక నధికారంబున్ జెలాయించు రా
జభటుల్ పిమ్మట గౌరవించునటు లీశా! భృత్యులౌ నయ్యము
ప్రభృతుల్ పూర్వమురీతి గాకిక భవత్పాదాశ్రయు ల్గన్నన్ గాం
చి భయంపెట్టక గారవించెద రహో! శ్రీరామచంద్రప్రభూ. ౧౨

మ. నిదురం జెందెదు నవ్వు డెన్నఁడు మమున్ నిత్యంబు వాత్సల్య సం
పద రక్షించుచునుండెదే! నాతండె సదా పాలించు గాకంచు జా
గ్రదవస్థన్ దమయాత్మ రక్షణకు జోక్యంబిడ్తెఁ గైకొంటఁ గూ
డదు నీ దాసుల కెట్టి వేళలఁ గృపాఢ్యా! రామచంద్రప్రభూ. ౧౩

మ. సకలంబున్ భవదీయలీలయనుచున్ సర్వంబును న్నీదునా
జ్ఞకు లోనై చరియించుచుండ ననుచున్ స్వాస్థ్యంబునన్ గట్టిన
మ్మకమే యూ నది కార్యమూను నెడ సామాన్యంబుగా నిల్వంబో
దకటా! నీదగు మాయ నీకె విదితంబౌ రామచంద్రప్రభూ. ౧౧

మ. క్షమకున్ దెబ్బ్లి సమస్తదుఃఖములతో సౌఖ్యం బటంచట్టిదుః
ఖములే పొందుచు కా[illegible]మునుగుచున్ గాలంబు సర్వంబు వ్య
ర్థముగాఁ బుచ్చియు దుష్టిగాంచెద సమేధ్యంబంచు వర్తించు దు
ష్క్రిమిచందంబున దుఃఖభోజి నగుచున్ శ్రీరామచంద్రప్రభూ. ౧౨

మ. తనుసంబంధులకెల్ల భద్రిసుగుచో ధైర్యంబుగా నాకు దో
చిన వేదాంతముఁ జెప్ప చుండెదను కించిత్తైన నాపత్తు గ
ల్గినచో నయ్యది సున్నచుట్టి కడుదుఃఖంతున్ శరీరాత్మభా
వనచే నియ్యది పో దొలంఘమిఁక నప్పా! రామచంద్రప్రభూ. ౧౩

మ. భయమెల్లన్ దొలఁగించి శాంతి గలిగింప న్నీదు పాదాంబుజ
ద్వయమే గొల్చెదఁ గర్మబంధముల ద్రెంప న్నీదునామాక్షర
ద్వయమే పల్కెద మోక్షసౌఖ్యము లభింప న్నీదు మంత్రాన్వయ
ద్వయమే యెంచెద భక్తియుక్తముగ దేవా! రామచంద్రప్రభూ. ౧౪

మ. భవదీయోత్సవకాలమం దఖిల గీర్వాణాధిపుల్ స్వీయది
వ్యవిమానంబులతో నభస్థులయి యుర్వాత్మ న్నినుం గాంచి సం
స్తవముం జేయుట కాని మా వలె భవత్పాదాబ్జ కైంకర్య భా
గ్యవిశేషంబును బొందలే రఖిలసేవ్యా! రామచంద్రప్రభూ. ౧౫

మ. పితరుల్ వేలుపులుర్ ఋషీశ్వరులు పృథ్వీదేవతల్ వేదముల్
ప్రతులుర్ వహ్నులు స్వీయభాగములు కార్యం జాలకున్నట్టి స
న్మతిదీనాత్ము నశక్తుఁ గోపపడుచో నాన్మేశ్వరా! నీ పదా
శ్రితు పక్షంబువహించి ప్రోవఁగదవే శ్రీరామచంద్రప్రభూ! ౧౬

మ. అతిదీనుల్ ఘరతుల్ ద్విజించి వసికత్వాసక్తిఁ జేరంగ స
మ్మతిగాంచెన్ భవదంఘ్రియుగ్మ మది యోమాత్రంబు మన్నేలు స
న్మతి యుష్మన్మణిపాదుకాయుగళమే మాయుత్తమాంగాళి నూ
ర్జిత భక్తి న్ధరియించుచుండుము మెపుడున్ శ్రీరామచంద్రప్రభూ. ౧౭

మ. ప్రకటోద్యజ్జ్వలమైన కాలమున దుర్వ్యాసంబులై కష్టముల్
సుకముల్ ప్రాణుల కప్రియత్నముగ వచ్చుం బూర్వకర్మానురూ
పకముల్ వాని సహింపనేర కితర ప్రార్థంబులం జేయు వా
రికి మా కెన్నడు చిత్తశాంతి గలుగున్? శ్రీరామచంద్రప్రభూ. ౨౮

మ. ఉపచారంబను పేరుతో సహవాసం బుత్సాహినై చేయు నా
యుపచారంబులు చక్కనెంచుటకు నయ్యజ్ఞానముం జేసి డీ
లుపడున్ గావున ప్రొద్దుపోని పనులాలోచింపగాఁబోక ని
ష్కపటత్వం బను కీర్తిసిల్కు గొను మింకన్ రామచంద్రప్రభూ. ౨౯

మ. ఇటు నీచుట్టు ప్రదక్షిణించుటకునై యేతెంచు నెవ్వాని కే
నటు స్వప్నంబున దోచి కోర్కెలిడి యానందంబు సంధింతు వ
క్కటా! జన్మావధి దాస్య మొప్పి కొని నీ కాల్దోయి నర్చించు నా
కిటు లేనిం గనరా విదేమిగతి తండ్రీ! రామచంద్రప్రభూ. ౩౦

శా. ప్రజ్ఞాహీనుఁడనై నిరంతరము గర్వంబూని సర్వేశు స
ర్వజ్ఞున్ సర్వజగన్నియామకుని సర్వప్రేమపూర్ణున్ గృపా
భిజ్ఞున్ నిన్ను భజింపనైతి నని నిర్వేదంబునం బొక్కు స్వ
ల్పజ్ఞున్ నన్ గరుణింప నీకు భరమా! రామచంద్రప్రభూ. ౩౧

శా. కానంతేఁయు నాత్మలాభము మదిన్ గాంక్షింప రెవ్వున్ భవ
ద్దాసోత్తంసులు వారిపాదరజమున్ దాల్తున్ దదుచ్ఛిష్ట మెం
తే సంతోషముతోఁ భుజించెదను దత్తీర్థంబు సేవింతుదున్
జేసాతున్ తదనుగ్రహంబునకునై శ్రీరామచంద్రప్రభూ. ౩౨

శా. చండాంశుం డమృతాంశుఁడున్ మఱియు నక్షత్రంబులున్ వర్షాళులున్
గొండల్ మొంచు సముద్రముల్ నదులు దిక్కుల్ వీని సృష్టించె నె
వ్వం డంచున్ గ్రహియింపఁ బూనియు గ్రహింపన్ లేక నిశ్చింతగాఁ
బండై పోవును చిత్తమెల్ల నరభూపా! రామచంద్రప్రభూ. ౩౩

శా. పాండిత్యంబు గడించినట్టి సుకవుల్ ప్రౌఢప్రబంధంబులన్
గొండాడం గలరే నపండితుడ నాకున్దోచిన ట్లెంచెదన్
పిండింబట్టియె రొట్టె స్వల్ప మనుచున్ వీక్షించినన్ బ్రోవఁగాఁ
దొండిం జేయకు మింక నేన ఖలబంధూ! రామచంద్రప్రభూ! ౩౪

మ. అరయన్నాగతి నుండి కొట్టులను చూపాం జేయంగా నేల నో
వరదా! సారథి వీవు నేను శకటంబై నీ మనస్ఫూర్తిగా
ధరణిం ద్రిప్పుము; లాభనష్టములు చెందం బోవునన్నొందు సు
స్థిర ధర్మప్రథితాను భావశుభమూర్తీ! రామచంద్రప్రభూ. ౯

మ. ఎది యెట్లొగిన నైన జిత్తమున నొక్కింతైన జింతింపఁబో
క దయాసారథినైన దాశరథి సంకల్పంబెనో యద్ది యా
గద నాకేమని యూరకుండుటయె సౌఖ్యంబౌను నాకట్టి శాం
తిదశన్ గూర్పుమటంచు నిన్గొలుతు సద్ధీ రామచంద్రప్రభూ ౧౦

మ. దయయున్ సత్య మహింసయుం గలుగు సద్దైవంబ వీవంచు ని
శ్చయముం జేసిరి నాస్తికేతర మతాచార్యుల్ స్వసిద్ధాంత మా
ర్గయుతార్థంబుల నట్టి పద్ధతులలోఁ గైకొంటి నే భక్తి ని
ర్దయ వృత్తం బఖిలేశ నిన్గొలువ నన్నా! రామచంద్రప్రభూ. ౧౧

శా. నీకైంకర్యము సర్వఁగా వలచితిన్ నిక్కంబు ముమ్మాటికిన్
నీకిష్టంబగు నేని ప్రత్యాసతులన్ శిష్టాత్ములం జూపు నే
గైకొందున్ దృణమే సదాత్మజులన్ గాన్పింపఁబో కేలనన్
నీకున్నాకునుఁ గాలయాపనము తండ్రీ! రామచంద్రప్రభూ. ౧౨

మ. మమతాబద్ధులఁ జేరి స్వామిపని సువ్మా! సత్కృపం జూడరో
క్కము గానీ, మతివెచ్చమైన నటిరసు గైకొందు మిమ్మెంచు; ని
త్యము దుఃఖించుటకంటె సర్వగము స్వావశ్యంబైన కైంకర్య వృ
త్తము వేభంగుల నుత్తమం బఖిల నాథా! రామచంద్రప్రభూ. ౧౩

మ. పరులన్ వేడుట పాడిగాదని మదిన్ భావించి సత్యంబు సు
స్థిర చిత్తంబున నీదునామ మనురక్తిన్ వ్రాయుచోఁ బొత్తముల్
విరచింపన్ గరుణించి యుచ్చుకొని కీర్తిన్ బిచ్చమెత్తించి నా
పరతంత్రత్వము బైటఁబెట్టితివి దేవా! రామచంద్రప్రభూ. ౧౪

శా. హాయిం బాపెడు వ్యాధులాధులును ఘోరాపత్తులున్ మిత్తులున్
బాయం జేసెడు నీపదాంబుజములన్ వాంఛింతు సేవింప నిం
కే యోగంబు లొనర్ప నేరను విభూ! ఈకొంచమున్ గూడ స
చ్ఛ్రేయంబైన త్యాగముదృష్టింపనమే శ్రీరామచంద్రప్రభూ. ౧౫

శా. "ఏయన్యాయముఁ జేసినంగసి యిదేమీ యంచుఁ బ్రశ్నింబునన్
జేయుంబోవరు విత్తవంతు నెవరున్, "ఛీ" యంచుఁ బైనుమ్మియున్
వేయంజాలెద రర్థహీనుఁ డెవఁడేనిన్ మంచిగావించుచో
న్యాయాన్యాయ విచక్షణేతరు లనంతా! రామచంద్రప్రభూ. ౧౬

మ. అనిశం బైహికవస్తుజన్యమగు కామాసక్తియున్ దన్నివా
రణాజన్యంబగు క్రోధమున్ ఘనముగా రాత్రిం పవళ్ళుక్కిరి
బిసి వేధించి నధింపఁబూను "నడకత్తెర్ బోక" చందంబుగా
మనుచుంటిం గరుణించుమింక నఖిలాత్మా! రామచంద్రప్రభూ. ౧౭

మ. ఒక సౌఖ్యంబు నశించి చిత్తమున దుఃఖోద్రేకముం బూర్చ నొం
డొక సౌఖ్యంబును గోరుచుండు టతి మూఢత్వ మంచెంచ నై
హికవృత్తిం గొను "నక్కలుకుక్కలకు నెంతే రోయుఁబో" కిందు నం
దకృతిప్రజ్ఞుఁడనైతి నివెగతి దేవా! రామచంద్రప్రభూ. ౧౮

శా. గుండెం బట్టదు, కూడొకింతయును కూర్కుల్ రాదు, నుంతేనిఁ గా
లుండేతెంచుట మున్నుగాఁ గలది యాలోచించు నంతన్ గృత
జ్ఞుం డార్తావన దక్షుఁ డాశ్రితులఁ బ్రోచున్ గాక యం చెంచుచో
దంచింగల్గు నొకొక్కవేళ, రఘునాథా! రామచంద్రప్రభూ. ౧౯

మ. శతజన్మంబుల కేసి త్వచ్చరణకంజద్వంద్వ సేవా సమా
హితబుద్ధి స్థిరుఁ జేసి ప్రోతువని, నిన్నే గాఢ భక్తిన్ సమ
ర్చితుఁ జేతున్ బరు నెవ్వనిం గొలువఁ దండ్రీ! నిక్కముం బల్కితిన్
పతితుండం చని విడఁబోలదిఁక దేవా! రామచంద్రప్రభూ. ౨౦

మ. పరికింపన్ బరిదృశ్యమానమగు నీబ్రహ్మాండమెల్లం శుభం
కరమౌ నీదగు చండశాసనమునన్ గాసింత వ్యత్యాసముం
బొరయుం బోవక యుండుఁ గావునఁ గృపాపూర్ణుండవై నాకు ని
పరమస్థానమునందుఁ జోటొసఁగు మప్పా! రామచంద్రప్రభూ. ౨౧

మ. అనిశం బస్మదఘౌఘపంకములు పాయన్ గాలమయ్యెన్ భవ
ద్ఘన కారుణ్య సుధాపయోనిధితరంగంబుల్ స్వవేలాతలం
ఘనముం జేసి సమస్త భక్తజనరక్షాదీక్షమై యెగుదెం
చెను గావన్ లలితప్రసన్నగతులన్ శ్రీరామచంద్రప్రభూ. ౨౨

మ. సిరియుఁ సంపద గూడియున్నపు డతి స్నేహంపుఁ గూటల్ సువి
స్తరముల్ పల్కుచు నుండి బక్కఁబడుచోఁ దథ్యంబుగాఁ బట్టి డో
కిరత్నైనం బడ వేయనట్టి దొరలన్ గేల్మోడ్చి యాచింపఁ బో
వరు నీతత్త్వమెఱుంగు సాధువులు దేవా! రామచంద్రప్రభూ. ౨౭

మ. అనివార్యంబగు కాలవేగమున ఘోరాపత్తులన్ గ్రమ్ముచు
న్నను నిన్నే శరణొంద నేరక కితరుల్ నన్ బ్రోతు రంచెంచుటల్
ఘనపాకీటమునుంగుచున్ దరిగనంగాలేక యేనక్కతో
కనో బట్టిందలపెట్టినట్టులె యగుంగా! రామచంద్రప్రభూ. ౨౮

మ. సుకముం గూర్చుచు పాంథలోకమున కచ్చుంబార్చినట్లున్న ప
చ్చిక నొప్పారు తటాకగర్భముల వీక్షింపంగ నేని పవి
త్రకటాక్షామృత వృష్టిచిత్రితముగాదా! యంచు నీలీలనే
ప్రకటింపమ్యోడి నాదుచిత్తమున దేవా! రామచంద్రప్రభూ. ౨౯

శా. ఏకాంతస్థలి నిల్చి నీకృతములై యొప్పారు చిత్రంబులం
దాకాశంబును మేఘమాలికలు వృక్షాంకూరముల్ చాపరా
ళ్ళాకన్ బూవులు కాయలుం జిగురు లత్యంతంబు వీక్షించి చి
త్తైకాగ్రత్వము గాంతు నొక్కపరి దేవా! రామచంద్రప్రభూ. ౩౦

మ. ప్రతిమాద్యాకృతి నున్న నిన్ గని నయప్రజ్ఞానులీ రాళ్ళు దే
వతలా? యంచవి వెక్కిరించెదరు సర్వవ్యాపివై దీన భ
క్తతతిం గావఁగ నెట్టిరూపమునునైనం గొందు వీవన్న సం
గతి నింతేనిదలంపఁబోక, జలజాక్షా! రామచంద్రప్రభూ. ౩౧

శా. కారాగారముఁబోలు దేవళమునన్ గట్టిగ సర్వేశ్వరున్
మీరల్ నిల్పుట పాడిగాదనెదకేమీ సర్వలోకాత్మకం
బై రాజిల్లెడు గాలి నొక్కయెడఁ గార్యార్థంబుగా నిల్పుచోఁ
గారింపంబనునే సదాగతికడంకన్ రామచంద్రప్రభూ. ౩౨

మ. ప్రతివర్షంబునఁ బెండ్లియేమిటికి భార్యల్ పెక్కురా స్వామికిం
చతి వాదంబొనరించువా రిసలు గేహంబేల! నైవేద్యమే
లు! తదారాధనమేల! గోపురములేలా? వేదశాస్త్రోక్త ప
ద్ధతి సర్వంబు నటించిరే, యఖిలనాథా! రామచంద్రప్రభూ. ౩౩

మ. భగవంతుం డనువాఁడు లేఁడనుచు నా విజ్ఞానికంబో, గలం
డగుచుండో సగుణుండొ దేవుఁడను విద్యాహీనుఁడే ప్రాజ్ఞుఁడై
పొగడొందుం జగతీతలంబున సతంబుం భక్తివిశ్వాస ధ
ర్మగరిష్ఠాత్ములచేత నెప్డు నఖిలాత్మా! రామచంద్రప్రభూ. ౫౪

శా. లంచం బేటికి? దేవదేవునకు నేలా? కట్నముల్ కానుకల్
ప్రాంచద్భక్తి పురస్సరంబుగ మదిం బ్రార్థించినం జాలదే?
యంచుం బల్కుదు రట్టిప్రార్థనయు నూహం జేయఁగా? లంచ మం
చంచుం దప్పగునే? వచింపు మిది తండ్రీ! రామచంద్రప్రభూ. ౫౫

మ. మనసున్ వాక్కు గ్రహింపలేని పరమాత్మున్ దేవతాగారమం
దున నర్చింపఁగ వచ్చునా! యనుచు నిందింతుర్ మానసధ్యానమే
ఘనమంచుం వచియించు వారెటులు వాక్చక్షుర్మనోగమ్య దే
వుని బ్రార్థింపఁగలారొ? చిత్తమున బాబూ! రామచంద్రప్రభూ ౫౬

మ. హలికుం డీ భువి సర్వమొక్కటెగదా! యం చూషరక్షేత్ర పా
ళుల సేద్యంబొనరింపనట్లు శుభశీలుం డెప్డు నీవన్నిటం
గలవంచుం వినిషిద్ధవస్తువుల నాకం బోవఁ డెన్నండు నే
ఫలముం గల్గమిగాన దాన, నతభూపా! రామచంద్రప్రభూ. ౫౭

మ. విధిగా నీ వఖిలాంతరాత్మవను మూర్తిం గాంచు విజ్ఞాని యా
త్మధనుండాదిగ నొప్పు సర్వవిధభక్తశ్రేణులం గ్రియాముల్
విధులుం గల్గవె? వానిఁ గైకొనినచో వేదప్రమాణంబు వి
ఘ్నఘ్నమై పోవదె? యొక్కమాఱు జగదీశా! రామచంద్రప్రభూ ౫౮

శా. ఊహాపోహల కందరాని నిజ శాస్త్రోక్త ప్రకారంబు ని
ర్మోహుల్ భక్తులెటుల్? వచించి రటులేఁ బూజింతు నిత్యంబు దా
సోహం భావముతో యథాబలము దేవా! యెవ్వరేమన్న నా
కేహానిం గలుగంగఁ బోవదికఁ దండ్రీ! రామచంద్రప్రభూ. ౫౯

మ. అరుణాంభోజనిభంబు లాశ్రిత మనోహ్లాదంబు లత్యంత దు
ర్భర దుష్కృత్యకృతమ్ము పతంగములు దావాగ్రి సంసార సా
గర సంతారకముల్ భవచ్చరణముల్ గైసేతు నిత్యంబు సు
స్థిర కారుణ్యరసామృతోరు జలధీ! శ్రీరామచంద్రప్రభూ. ౬౦

శా. కాలుం గేలు కనుల్ మనంబు దలయున్ గాసింతనీ సైపవఁ జే
చేలం బెట్టఁ నాపశంబులగుచున్ జెన్నొందు నిష్ఫట నే
వ్రాలుం బత్తిరి నెట్టి నీ చరణముల్ ప్రార్థించెదన్ దుత్తరం
బాలున్నప్పుడె పాశమన్న యటు దేవా! రామచంద్రప్రభూ! ౯౮

మ. మదమాత్సర్యతమశ్ఛటల్ గనుల గ్రమ్మన్ గానరాజాల కై
య్యది నానోటికివచ్చినట్లు ననుము దూరాలోచనల్ మాని బె
ట్టిదమౌ కార్యలు పెక్కుకూర్చితిని దండ్రీ! నిన్ను నీవారలన్
సదయాపాంగ! క్షమింపవయ్య! జగదీశా! రామచంద్రప్రభూ! ౯౯

శా. ఆచారంబులలో విచారములలో నాహార సంపత్తిలో
నీచస్థాన మలంకరించిన కవిన్ నేఁబుట్టుటే నీచమౌ
తోచెన్ ప్రార్థన చిక్కనుల్లు లెగన్! ధూర్తాశ్రితా ఘోరఘు! నీ
కై చేమోడ్చు ననుగ్రహింపుము మరి దేవా! రామచంద్రప్రభూ!

మ. ప్రణతిం జేతు నవ్వార్నిశంబు యనుచున్ భాసిల్లు నీ సత్కృపా
గుణముం గోరచి, "నమోనమో" యనుచున్ గోపించి దండించు ని
న్నుఁ బుమాత్రంబును నమ్మజాలను స్వభార్యన్ జానకిన్ సింధుగ
ర్భిణి నష్టాకలు పెట్టి నన్నెఱుఁగనే! శ్రీరామచంద్రప్రభూ! ౧౦౧

మ. ఎవరేవస్తువు గోరినన్ దడయకెంతేనిత్తు వీవంచు మా
నవగుల్ చెప్పినమాట నిశ్చయము కానేకాదు, వేన్నియతే
దు విరాధిప్రజ, కన్యకామణుల కెందున్ వత్సమం గూర్పలే
దు, విచారింపుము వాస్తవం బఖిలబంధూ! రామచంద్రప్రభూ! ౧౦౨

మ. బలవంతంబుగనో, స్వభావముగనో, బల్మారు నేఁ బూర్వజ
న్మలలోఁ జేసిన పాపకర్మచయముల్ నన్వేచినన్ బాధమై
పిలపింతున్ మతిలేక యెంతకు నిజమున్ వీక్షింపఁగా నెప్పుడున్
మొలపం బెట్టసి దిట్టు మొఱ్ఱు నిల బాబూ! రామచంద్రప్రభూ! ౧౦౩

మ. బలునంకెళ్ళు దగిల్చి చేతులకు నిర్బంధింప శ్రీరామచం
ద్రుల కేసెల్లప్పు డంజలిం జలుప నెంతో ప్రేమ పోలీసులి
ట్టులు గావించిరటంచు నెంచు సుగుణాఢ్యున్ రామదాసున్ గృతాం
జలినై మ్రొక్కెద భక్తితత్త్వము లభించన్ రామచంద్రప్రభూ.

మ. కొరడాలంగొని నీవుచిట్టునటులన్ గొట్టంగ రామా! శుభం
కరమౌ నీదు మహోత్సవంబునకుఁగాఁ గైకొమ్ము భేరీధ్వనుల్
కరుణాబ్ధీ! యను రామదాసుని నుతింగావింతు నత్యంత సు
స్థిరశాంతంబు లభింపఁగా నిరతమున్ రామచంద్రప్రభూ! ౧౦౫

శా. కారాగారములోని వారలను భక్త శ్రేష్ఠులన్ జేసి తీ
వారా! యుంచని కత్తులం బొడువ రామా! నీవసంతోత్సవ
శ్రీ రక్తంబునఁ దీర్చికొమ్మనినయా శ్రీరామదాసున్ బ్రియం
బారన్ సంస్మరియింతు దాస్యము లభింపన్ రామచంద్రప్రభూ!

మ. హరి! వైఖానససూత్రజాత నరసింహాచార్య నర్సాంబికా
వరపుత్రద్వయిలోన నగ్రజుఁడు గోపాలాభిధానుండు త్వ
చ్చరణాసక్తి రచించె దుర్భవవిమోక్షాపేక్ష నీ పద్యముల్
స్థిరచిత్తంబునఁ జిత్తగింపవలయున్ శ్రీరామచంద్రప్రభూ! ౧౦౭

శా. నీ నామంబులకున్ స్వరూపమునకున్ నీదివ్య పాదాంబుజ
ధ్యానాసక్తులకున్ బ్రపన్నులకు సత్యక్షేమసమ్మంగళ
శ్రీ సందారుచు నుండుఁగాత యెపుడున్ శ్రీతమ్మర గ్రామ సం
స్థానాధీశ్వర! దీనరక్షణ సుదీక్షా! రామచంద్రప్రభూ! ౧౦౮

రామార్పణమస్తు.



శ్రీరామాయ నమః

# తమ్మెర శ్రీ సీతారామ ప్రభావ సంగ్రహము

శ్రీమత్తమ్మెరపురవాస్తవ్య శ్రీ సీతారామచంద్ర ప్రభూ! సాష్టాంగనమస్కారంబులు. శ్రీజానకీ హృదయారవిందమిళిందా! నా పునఃపునర్నమోవాకంబులు. కౌసల్యానందనా! భూయో భూయః ప్రణామంబులు. స్వామీ! భక్తవత్సలా! నాయందనుగ్రహించి మామనవిని కొంచెమాలకింపుము. ఏమనెదవా? నీవీ గ్రామంబునందార్యాకృతిగొప్పి స్వీయభక్తవాంఛాప్రదాతవై యుండుట, నీదాసులకు గొంచెమైనం దెలుపుట నీసేవకుడనగు నాకు విధియైయున్నది. కాని యది నీకే మనవిచేయదలంచితిని. ఏలంటివా! సర్వాంతర్యామివగు నీకు మనవిచేసిన నందరికి మనవిచేసినవాడనే యగుదును. నీవు సంతసించినభక్తులేకాదు లోకమంతయు సంతసించును కావున నేకదా యనన్యగతికుడనై నీపాదసేవయందే యుండుట. అవ్యాజకృపాశాలివగు నీవీ దీనుని విజ్ఞాపనము విని రక్షింపగలవను గట్టినమ్మకముతో, వచింపనెంచితిఁగాని, భవదార్యాప్రతిష్ఠ యిప్పటికి(౧౩౦)సంవత్సరములక్రిందట జరిగిన దగుటచే, తత్ప్రతిష్ఠాసమయమందు కైంకర్యమున బాల్గొనినవారగు, బ్రహ్మశ్రీ॥ పురాణం రామయ్యగారివలన విషయమంతయు సవిస్తారముగా విన్నట్టియు, నిప్పుడు (౯౮) * సంవత్సరముల వయస్సుగల వృద్ధునివలనను (౮౦) సంవత్సరములనుండి గనుపరచు వైభవము మాతండ్రిగారివలనను గ్రామస్థులగు పెద్దలవలనను వినిన విధమున వ్రాసి నాకు సర్వస్వామివైయున్న నీపాదారవిందముల కర్పించుకొనియెదను. నమోనమః; తమ్మెరపురాధివాసా! పాలితగోపదాసా! శ్రీరామ చంద్రప్రభూ! నమోనమః.

ఆత్మేశ్వరా! యికవినుము. పూర్వము అనగా (౧౩౦) సం॥రములక్రిందట నీయూరి కానుకొని యుత్తరముగా విశాలప్రదేశమందు

* మంగలి నరసింహము అనువాడు,

హనుమన్మంటపము, దానియందొక హనుమన్మూర్తియు, వీనికెదురుగా మక్కుడువేసియున్న చిన్న కోవెలయును గలవు. అవి యెన్ని వందల సం॥రముల నాటివో తెలియదు. మఱియు నీ గ్రామమధ్యమందు ప్రాత బడిన నాల్గు బురుజులుగల కోటగోడకు పురుష ప్రమాణమునకు లోపుగాగల నొక దివ్యసుందరమైన కేశవస్వామివార్ల విగ్రహము మాత్రము మానింపబడియుండెను. ఊరిలో (౫) బ్రాహ్మణ కుటుంబము లుండెడివి. అందు నియోగులు బ్రహ్మశ్రీ నార్పరాజు వెంకయ్యగారు, సహధర్మచరియగు చెల్లమ్మగారితో చక్కని గృహస్థ ధర్మానవలంబులై నివసించుచుండిరి. ఆమెగారు నిత్యము నా కేశవవిగ్రహమును చూచి నమస్కరించి వెళ్లుచుండును. ఆమె భర్తయుఁ బ్రతి మాసమునకు నియతిఁ దప్పక శ్రీమద్రామాయణమును, పారాయణ మొనర్చి, సీతాకళ్యాణములు, శ్రీరామ పట్టాభిషేకములు, జరుపుచుండిరి. కాని "దాశరథిని నమ్మినవారికి దారిద్ర్యమే సాక్ష్య"మన్నట్లుగా నైహిక ధన సంపన్నులు గాకపోయిరి. గ్రామజను లందఱితో నైకమత్యము వహించి, హనుమదాలయమందు రామభజన మేర్పాటు గావించి, జీర్ణమైయున్న యాలయప్రతిష్ఠ నొనర్ప ప్రోత్సాహపఱచుచుండిరి. ఇట్లుండ నెవ్వరో పిలిచినట్లు శ్రీరామభక్తాగ్రేసరులగు బ్రహ్మశ్రీ పురాణం రామయ్యగారను బ్రాహ్మణోత్తములు వీరింటి కతిథి యయ్యెను. వారికీ విషయమంతయుఁ జెప్పగా విని సంతసించి సీతారామస్వామివార్లనే యీ హనుమంతు నెదురఁ బ్రతిష్ఠింపవలయుఁగాని, కేశవమూర్తియొకరు సిద్ధముగా నుండిరి. కనుక నీయననే బ్రతిష్ఠింతము. మఱియు మా స్వగ్రామమున నా మందిరమునఁగల సీతారామలక్ష్మణ (తామ్ర) విగ్రహముల నుత్సవాదులకై యిచ్చటికి తెచ్చి సమర్పింతునని కార్యనిశ్చయము చేసెను. ఇంతలో నీ గ్రామ సమీపమందలి గుడిబండ యను గ్రామ మందు నివురుగప్పిన నిప్పువలె దాంభిక వేషములేక నిర్మలహృదయముగల భక్తుడు, కత్రిం వెంకటరెడ్డి యనువారు తమ గ్రామమున నం దాలయము కట్టించి, కేశవస్వామిని బ్రతిష్ఠింపదలఁచి, యీ గ్రామమందుగల స్వామిని అడిగెను. కాని గ్రామస్థులు మొదట సమ్మతింపకయు, రెడ్డిగారు బ్రతిమాలఁగా బ్రహ్మ

శ్రీ పురాణం రామయ్యగారును, బ్రహ్మశ్రీ నార్పరాజు వెంకయ్యగారును, తాము రాకయునిలుండగే పేర్మిగలవారగుటవలన నీ మూర్తి నీయ సమ్మతించిరి. అప్పుడే రెడ్డిగారు, ఎన్ని వత్సరములనుండి యర్చనాదులు లేకున్నను, స్వీయకాంతి దొరంగక, శంఖ చక్ర గదా పద్మములతో, చతుర్బాహువులతో, బ్రహ్మసూత్ర కటిసూత్ర వనమాలికాది దివ్యాభరణములతో, నొప్పుచు ముద్దులు గురియుచు, దివ్యకళలచే విరాజిల్లుచున్న కేశవస్వామివారును, భయభక్తులతో బండియందుంచుకొని మంగళవాద్యములతో ప్రయాణమై యూరిపొలిమేరకు జేరిరి.

ఈ విషయమంతయు నింటిలో శ్రీరామనామముతో కాలక్షేపించుచున్న చెల్లమ్మగారికి దెలియగనే, యామె: స్వామీ- కేశవా! నిన్న మొన్నటివరకు నీ యందే ప్రతిష్ఠించుకొనుమని మావారు సెలవీయ వింటినే. ఇంతలో నన్నొందుకిట్లు బంపగలంటివి, నీకిందుండుట కిష్టములేక యుండెనా? యని "పెన్నిధి గోలుపడిన పేదవలె" సంతతప్రవాహితబాష్పధారయై, వెక్కి వెక్కి యేడ్చుచు నలువురు చూతురను సిగ్గును భయమును వీడి, పరవశయై సొమ్మసిల్లి నిండుగర్భవతి యయ్యు, నతివేగముగ బరువిడి, స్వామివారి పాదారవిందములు దన కరాంబుజములచే బట్టుకొని దేవాదిదేవా! కేశవా! మమ్ము దిక్కులేనివారిలంజేసి, గ్రామాంతరముం
స్వామీ! వెళ్ళెదవా? వెళ్ళెదవా? యని బిగ్గర గొంతెత్తి యేడ్చెను. ఆమె భర్తయు నామె చేతుల స్వామిపాదములనుండి విడదీసి, బండిలో గొంపోయి కొని పొండని వారికిజెప్పి, మనము శ్రీరాముని బ్రతిష్ఠించుకొందములే యని యోదార్చుచుండెను. బండి ముందుకు నడువసాగెను. ఆహా! దైవచత్రము!! బండికిగట్టిన యెద్దులు తత్క్షణమే కంఠారవ్రజేసి, కొదమ సింగములవలెం జెలరేగి, రంకెలువైచి యచ్చట జనులందఱెంతయడ్డము దూఱినను సడ్డసేయక, యొక నిముసములో గ్రామంబునకు దక్షిణముగానుండు బండిని, ఉత్తరమున హనుమంతుని మంటపమున కెదురనున్న ప్రతిబడిన కోవెలయొద్దం జేర్చి, మఱి కదలినవికావు. వీనిని విప్పి మఱియొక జతను కట్టుదమని యనుకొనుచుండగనే, మెడ్డ తాళ్ళం ద్రెంపుకొని

"శ్రీరామచంద్ర స్వామివారు గంగాతీరమందు శయనింపఁగా, లక్ష్మణ స్వామియు గుహుఁడు నెట్లు ధనుర్ధరులై చుట్టు గాచియుండిరో," యట్లు తమ వాడి కొమ్ముల విదళించుచు, స్వామిగల బండిచుట్టు సిరవకాశముగా పరువులు పారుచుండెను. అంద అక్కడి కేతెంచిరి. "రామచంద్రమూర్తీ! సత్యసంకల్పుఁడవగు నీ చిత్ర మెవ్వ రెఱుంగగలరు!" అనునంతట నచ్చటనే యయిదేండ్ల ప్రాయపు బాలుఁ డావేశ మొంది యిట్లు చెప్పం దొడంగెను. మీరీ స్వామి నిచ్చటనే ప్రతిష్ఠింపవలయును. మఱియు నీ యాలయమున కీశాన్య భాగమున (౨౦౦) గజముల కవతల నొక పుట్టగలదు. దానిలో సీతారామస్వామి గలఁడు. రేపుదయమున మీరెల్లరు స్నానంబొనర్చి మంగళవాద్యములతో నచ్చటికి వచ్చువేళకు గరుడపక్షి వ్రాలఁగలదు. దానిఁ దర్శించి స్వామివారు బయలుదేరుదు రని చెప్పి మఱియు నిట్లనియె. రెడ్డీ! ఈ ప్రతిష్ఠ యిచ్చట నీద్రవ్యముతోడనే పూర్తిగావింపుము. నీ వంశస్థులిచ్చట ధర్మకర్తలుగా నుండవలయునని వచించి, మఱల బాలురతో నాడంజనియె. గ్రామజనుల కోరికలన్నియు నాదినమున సమకూరెను. ఆనాటి వారి సంతోషము నావంటి బుద్ధిహీనుఁ డూహింపంగనైన లేదు. ఇఁక మనవి సేయుటెట్లు? అది విని రెడ్డిగారు మహానందముతో సాష్టాంగముగఁ జాగిలబడి మ్రొక్కి, స్వామీ! నీ వెక్కడ వేంచేసి యున్నను, నాకు నీ కైంకర్యమే కదా కావలయును? నీచిత్తమెట్టులో యట్టులే యొనరించెదనని వేవిధముల స్తుతించెను. ఆ గడియలోనే యెద్దులు పూర్వస్థితికి వచ్చెను.

తండ్రీ! రామచంద్రా! అట్లు గ్రామజను లందఱు తెల్లవారు జామున మేల్కని, కాలోచితముల నెరవేర్చి, పరమోత్సాహులై సహదారులగు బ్రహ్మశ్రీ నార్పరాజు వెంకయ్యగారును, రెడ్డిగారును, పురాణం రామయ్యగారిని ముందిడుకొని మంగళవాద్య పురస్సరముగా బాలుడు వచించిన వల్మీకముఁ జేరగనే, గరుడపక్షి వ్రాలి యెగసి చనియె. పిదప దానిలో లభించిన "శ్రీ సీతారామస్వామివార్ల" నత్యంత భక్తితో గ్రహించి, యొకచో నుంచి, యది ఫాల్గుణశుద్ధ మగుట, తత్పక్షమందే లగ్నము నిశ్చయించి, కేశవమూర్తిని, రామమూర్తిని,

ప్రతిష్ఠచేసి; ఏతద్గ్రామ సమీపస్థులును, బండపాలెము (ప్రస్థరపురి) శ్రీనివాసమూర్తి పూజకులును, కాశ్యప గోత్రజులు నగు నరహరి అప్పలాచార్యులు, గోపాలాచార్యులవార్లను వైఖానసుల నర్చకులుగా నియమించిరి. పురాణం రామయ్యగారు తమ మందిరములోని సీతారామ లక్ష్మణమూర్తులను (వీరే యిప్పటి యుత్సవమూర్తులు) తీసికొని వచ్చి సమర్పించిరి.

ఆ సమయమందే బ్రహ్మశ్రీ నా॥ వెంకయ్యగారు (౫) ఎకరముల వరిపొలమును, (౨౫) ఎకరముల మెట్టభూమియు- స్వామివారి నిత్య నైవేద్యములకై యేర్పాటు గావించిరి. ప్రతి సీతాకళ్యాణ సమయమందు రెడ్డిగారిని పెండ్లికూతురు వైపు వారిగా నియమించి, తాము పెండ్లికుమారుని వైపు వారుగానుండి, స్వామివారికి వస్త్ర భూషణములు రెండు పక్షములవారి * గోత్ర నామధేయములతో సమర్పించుచుండిరి. అట్లు కొంతకాలము జరిగినపిదప భగవద్భక్తులునగు బ్ర॥ నా॥ వెం॥ గారి పెద్ద కుమారులు నృసింహారావుగారు, సాత్వికభక్తియందు దమ తల్లికి సమానుడై- స్వామికార్యములయందు మిక్కిలి తోడ్పడుచుండెను. వెం॥ రెడ్డిగారును తన పూర్వ నివాసమగు గుడిగుండ గ్రామమును వీడి, కృష్ణాపురమను పల్లెయందు వసించుచు ప్రతి యేకాదశికి నిచ్చటికి వచ్చి స్వామివార్లను సేవించుకొనుచుండెను. ఈ చిన్న కోవెల ముందుగా దొమ్మిది గదుల ముఖమంటపమును, కొద్దిగా లోపలి విమాన గోపురమును, గట్టించి, సంప్రోక్షణాదికము జరిపించి స్వామి శలవొంది యింటికి వెళ్ళిన రాత్రిమె పిరిస్వప్నమునం దొక బాలిక యాకుపసరు ముళ్లపట్టుచీర గట్టుకొని బిందె చేతపట్టుకొని కంటదడి పెట్టుకొనుటం గాంచి యేమమ్మా! తొందరగా నీళ్ళుతోడుకొని వెళ్ళక కంట నీరు బెట్టుకొనుచు నిలుచున్నా వేమని యడుగంగా, నామెయు, లేమిడి కాపురమగుటచే మావారు తెచ్చునది పొట్టకేచాలదు. ఇక బావి త్రవ్వించుకొను యోగ్యతయెట్లు వచ్చును? మీవంటివారెవరయిన సమీపమందు బావి త్రవ్వించువరకు నాకీకష్టము దొలగు నుపాయము

* నా॥ వెంకయ్యగారిది హారితసగోత్రము — క॥ వెంకటరెడ్డిగారిది తావెళ్ల గోత్రము.

లేదని విచారపడుచున్నాను. దూరపునీళ్ళు మోయలేక చూడుము తాతా! నా కాళ్ళెట్లు బొబ్బలెత్తుచున్నవో? యని చెప్పి యదృశ్య యయ్యెను. వెంటనే మేల్కాని యది యంతయు నాతల్లియగు సీతాదేవి మహిమయే యని నిశ్చయించుకొని యెవరితోడ జెప్పకయే యచ్చటికి వచ్చి స్వప్నవృత్తాంతము యోగ్యులగు వృద్ధులకు దెలిపి, "శ్రీరామపుష్కరిణి" యను పేరుతో ఆ దినములలోపల చదరపుటిరువది గజముల విస్తీర్ణముగల నడబావి త్రవ్వించి, దాని తీర్థముచే పెరుమాళ్ళ కర్చనాదికము జరిపించిరి. వారి యావజ్జీవము విశేషముగ నిచ్చటనే వసించుచు గాలముగడిపిరి.

పిదప లోపలి విమానగోపురమునకును, ముఖమంటపమునకును పైన చక్కగా సున్నము వేయించని కారణమున వర్షకాలమున చీమల చేతను వర్షము కురియుటచేతను చాల బాధగానుండెను. అట్టి దినములలో నొకరాత్రి కర్తం వెంకటరెడ్డిగారి కుమారులగు బసివిరెడ్డిగారి స్వప్నమున, నొక బ్రాహ్మణకన్య తడిబట్ట కట్టుకొని చలికి బాధపడుచు గనఁబడినఁ జూచి, మొదటినుండియు "భూతదయగలవాఁడు" కావున వెంటనే తన యుత్తరీయము గట్ట నిచ్చెను. కాని యామె యంగీకరింపక వర్షమునకు గురియుచున్న మా యిల్లు గప్పించెదవేని నీ వస్త్ర మంగీకరింతును. లేకున్న వలదనియె. నట్టులే చేసెదనంచుండగనే యదృశ్య యయ్యెను. తత్క్షణమే మేలుకొని- అమ్మా! సీతమ్మా! లోకమునం దెందరు లక్షాధికారులు లేరు! వారి వంకనైన జూడక, తనకు సర్వశక్తిమత్త్వము గలిగియు, వారిసందఱం దరింపఁజేయు గపులచేఁ గైంకర్యము గొన్నయట్లు, ఈ నిర్భాగ్యుని దరింపఁజేయుటకు గదా నీ విట్లు సంకల్పించుట! నీ సంకల్ప మట్టిదైన నే నేల కాదందును? అని, బయలువెడలి యిక్కడకువచ్చి స్వామివారిని సందర్శించుకొని, వృత్తాంత మంతయు నర్చకులగు స|| గోపాలాచార్యులవారికి జెప్పి యనుమతివడసి, వారిపుత్రులగు నరహరి, నరసింహాచార్యుల వారిని వెంటబెట్టుకొని, యక్షయపాత్రికై బయలుదేరి, తన బంధువుల యొద్ద తగినంత ద్రవ్యము భిక్షయొనర్చి, యాలయములోని ముఖమంటపమునకు సున్నమును, విమానమునకు సుధా చిత్రమును

చేయించిరి, (ఈ కైంకర్యము హేవళంబి సం॥ర శ్రావణ బహుళ మందు జరిగినది.) మఱియు దమ స్వంతద్రవ్యముచే నాలయమం దీశాన్యభాగమున వాహనశాలయు వాయవ్యభాగమున బచనాలయ మునుఁ గట్టించిరి. వీరికిప్పుడు నలువురు కొడుకులు గృహకృత్యములుఁ జూచుచుండుటచే నింట బాధలేకుండెను. తమ యావజ్జీవము స్వామి సన్నిధియందే గడుపనెంచి జటాధారియై యిచ్చటనే తిరుగుచుగా కాలము బుచ్చిరి. శ్రీ స॥ న॥ చార్యులువారు బసివిరెడ్డిగారివలననే తమకు స్వామి వారికైంకర్యము సంప్రాప్తించెనని సంతోషము చెందుచు స్వగృహము నందు రాత్రులు హరిభజనయుఁ గాలక్షేపముఁ బ్రారంభించిరి. అన్నిటికి మూలకందమైన హరిభక్తివిద్యాసాధనముచే సన్నివిద్యలు దానివెంటనే వృద్ధిగాజొచ్చెను. గ్రామజను లందరు పెరుమాళ్ళయందును, వీరియందును విశ్వాసముఁ గలవారై స్వామికార్యమనిన ముందడుగు వేయుచుండిరి వీరి కిప్పుడు నార్సరాజు నరసింహదావుగారి కొమారులు వెంకట రామారావుగారును, కొరపాటి నృసింహదాసుడును దోడ్పడిరి. స్వామి సన్నిధిని ప్లవంగనామ సం॥ర మొక సప్తాహము జరిగినది. తత్కార్యావ బృథమునుంచి యాచార్యులవారికి కండ్లు పోటు, మంటఁ గలిగి తీవ్ర బాధకలిగెను. ఆ దినములలో నొకనాటి పగలు నొక వైష్ణవుడు స్వప్న గతుండై కళ్యాణమంటపముఁ గట్టింపఁ బ్రారంభించినగాని బాధ శాంతింపదనఁగా నానాడే పని మొదలిడిరి. తత్క్షణమే బాధ శాంతి నొందెను. దీని ప్రతిష్ఠ (కీలక సం॥రము) శ్రీ ఆచార్యులవారు, కత్రం బసివిరెడ్డిగారి మూలముగా నక్షయపాత్ర ధరించి నదిమొదలు సేతా వత్స్యాంతము మంటప ప్రాకారాదులకేమి, (౧౧) సప్తాహములకేమి, యొక లక్షరూపాయీల కైంకర్యము స్వామి సన్నిధిలో జరిగెను. ఈ కైంకర్య విషయము నే నెఱిగినంతవరకు దీన నొక పత్రమున నుదహరించి, భక్తజనుల సన్నిధి సమర్పించి కృతార్థుడ నైతిని.

ది 23—1—1944,
ఇట్లు విధేయుఁడు,

స్వభాను సం॥ర పుష్య బ ౧౩ ఆదివారం.
నరహరి గోపాలాచార్యులు.

## తమ్మర శ్రీ సీతారామస్వామివారి ఆలయకైంకర్య వివరము

1. హనుమంతుడు మంటపము కాలము తెలియదు.
2. కేశవస్వామి, సీతారామస్వామి, ప్రతిష్ఠలు శ్రీరామపుష్కరిణి ముఖమంటపముగాని విమానము. — ౧౩౦ సం॥ క్రిందట.
3. పరమ్మతు వాహనశాల పచనాలయము. — హేవళంబి సం॥రము.
4. కళ్యాణమంటపము. — కీలక సం॥రము
5. సింహద్వారము, అధ్యయనమంటపము. — రాక్షస, సం॥రము
6. ప్రాకారము, [illegible], [illegible] ములు, [illegible]. — ప్రమోదూత సం॥ర [illegible] (1930).
7. పాదగోపురము, రథము, [illegible]. — అంగీరస సం॥ర, చైత్ర [illegible] సోమవారం (తే 25-4-1932).
8. ఆలయఉత్తరమంటప నిర్మాణము. — యువసం॥ర ఆషాఢము (1935)
9. తెరమంటపము. దక్షిణమంటపములు, పశ్చిమమంటపములు. — ధాత సం॥రము (1936)
10. శ్రీకోదండరామప్రతిష్ఠ, ధ్వజప్రతిష్ఠ. — ఈశ్వర సం॥రం (1937)
11. జయవిజయ ద్వారపాలుర ప్రతిష్ఠ. — బహుధాన్యసం॥రము కార్తీక బ॥ శనివారం (తే 12-11-1938)
12. పుష్పవనమంటపనిర్మాణము. — చిత్రభాను సం॥రము జ్యేష్ఠ శు ౧౧ (తే 28-6-1942)

తమ్మర సీతారామ
ప్రతిష్ఠాపకవంశము:—

మ॥ శ్రీ, కత్రం వెంకటరెడ్డిగారు

బసివిరెడ్డి

నారాయణరెడ్డి

కృష్ణారెడ్డి

వెంకటరెడ్డి

పాలకవంశము:—

మ॥ శ్రీ, నార్సరాజు వెంకయ్యగారు

నరసింహారావు

వెంకట రామారావు

నరసింహారావు

సీతారామారావు

అర్చకవంశము:—

నరహరి గోపాలాచార్యులుగారు

నరసింహాచార్యులు

గోపాలాచార్యులు — యోగానందాచార్యులు

ది 23—1—1944,
స్వభాను సం॥ పుష్య బ ౧౩ ఆదివారం.

## ఈ గ్రంథకర్తచే రచింపఁబడిన గ్రంథములు.

### అచ్చుపడినవి.

శ్రీ జానకీనాయక శతకము - వేదగిరి నృకేసరి తారావళి
శ్రీ కృష్ణ శతకము - శ్రీరామ ధ్యాన సోపానము
శ్రీ భగవత్కృపాతరంగము - శ్రీ సీతాసనాధశతకము
శ్రీరామ బాల్యాది స్తవము - శ్రీ హరినామ మహిమ స్తుతి
శ్రీ సీతా స్తవము - భరన్యాసము
శ్రీవిష్ణు పంచాయుధ స్తవము - ప్రణతి = (విష్ణుపాదుకాస్తోత్రము)
శ్రీహరి చరణారవింద స్తోత్రము
శ్రీరామ తారామాల

### అచ్చుకానున్నవి

సుమతి సుధర్మ (నాటకము)
శ్రీరామభద్రస్తుతి శతకము
సుప్రభాతస్తోత్రమాలికా (సంస్కృతము)
కామగ్రహావేశము (గీతి)

చిరునామా:
నరహరి గోపాలాచార్యులు,
తమ్మెర గ్రామం.
* కోదాడు పోష్టు
హుజూర్నగరు తాలూకా - నల్లగొండజిల్లా. (నైజాం)